# పాణిని అష్టాధ్యాయీ సంజ్ఞా సూత్రములు

సంకలనం

ఎన్.వి. అనంత కృష్ణ

# పాణిని అష్టాధ్యాయీ
# సంజ్ఞా సూత్రములు

సంకలనం

ఎన్.వి. అనంత కృష్ణ

# ఇందులో..

సంజ్ఞ అనగా గుర్తు. ఇట్టి గుర్తు ఒక వర్ణమునకు కానీ, కొన్ని వర్ణముల సమూహమునకు గానీ, నిర్దిష్ట వర్ణాదియైన, వర్ణాంతములైన ప్రకృతి ప్రత్యయములకు కానీ, ధాతువులకు కానీ, ప్రాతిపదికములకు కానీ ఉండవచ్చు. ఒక సంజ్ఞ వర్ణ ప్రత్యయాదులు ఎన్ని రకాలలోనైనా ఉండవచ్చు. అట్లే ఇట్టి వర్ణాదులు కొన్ని సందర్భములలోనే అంటే కృత్తులు, తద్ధితలు, సమాసములు ఇత్యాదులలో ఉన్నప్పుడే, లేక ప్రత్యేకమైన అర్థమునందు ప్రయుక్తములైనప్పుడు మాత్రమే అని వాటి విస్తరము నియమించవచ్చు. అది సూత్రార్థము సమగ్రముగా తెలిసినప్పుడే అవగతమౌతుంది.

పాణిని అష్టాధ్యాయిలోని సంజ్ఞావిధాయక సూత్రములన్నీ ఒకచోట చేర్చటమే ఈ సంకలన లక్ష్యము. ఒక సంజ్ఞను అనేక సూత్రములు విధించవచ్చును. అట్టి సూత్రములన్నీ ఒకచోట సూచించబడ్డవి. అలాగే కొన్ని సంజ్ఞలు కొన్ని సందర్భములలో అర్హతయున్నను విధించబడవు. వీటిని అపవాద సూత్రములు అంటారు. ప్రతి సంజ్ఞ వివరణలో యీ అపవాదసూత్రములు కూడా చేర్చబడినవి. అలా ఒక సంజ్ఞగురించి సమగ్రసమాచారము ఒకచోటనే గమనించవచ్చు. ప్రతి సంజ్ఞలోని మొదటి సూత్రసంఖ్య ఆధారముగా, అష్టాధ్యాయి క్రమములో ఈ సంజ్ఞలు ఇవ్వబడినవి.

ప్రణాళికలో ముందుగా సంజ్ఞ పేరు, తరువాత సంజ్ఞావిధాయక సూత్రములు, సూత్ర సంఖ్య, అటుపై అపవాద సూత్రములేమైనా ఉంటే వాటిని అష్టాధ్యాయి క్రమములో ఇవ్వబడినవి. ప్రతి సూత్రము తరువాత కాశికా వృత్తి, సిద్ధాంతకౌముదీ వృత్తి ఆధారముగా క్లుప్తముగా సూత్రార్థము తెలుగులో ఇవ్వబడినవి. ఈ సంజ్ఞలకు అకారాది క్రమణిక, అలాగే ఒకటికన్న ఎక్కువ నిర్వచనాలు ఉన్న సంజ్ఞల పట్టిక గ్రంథాంతమున ఇవ్వబడినది.

ఇందులో కేవలము సంజ్ఞా సూత్రములే ఇవ్వబడినవి. ఇతర సూత్రములద్వారా విధించిన అనేక కార్యములలో సంజ్ఞల ప్రయోజనము, ప్రక్రియాంశములు చెప్పబడినవి. వాటిని ఉటంకించి చెప్పబడిన ఇతర సూత్రములు ఇక్కడ ఇవ్వలేదు. ఉదాహరణకి 'అదేఙ్గుణః ' అని గుణసంజ్ఞ విధాయక సూత్రము ఇవ్వబడినది కాని 'ఇకో గుణవృద్ధీ' వంటి ప్రయోగసూత్రములు ఇవ్వలేదు. ఇది ఒక చిన్నప్రయత్నము మాత్రమే. నమస్సులు. పెద్దలు గుణదోష విచారణ చేయుదురుగాక.

## వృద్ధిః ( 1 )

**వృద్ధిరాదైచ్** [1.1.1]

ఆ(త్), ఐ, ఔ – ఈ మూడు వర్ణములకు 'వృద్ధిః' అను సంజ్ఞ ప్రవర్తించును.

## గుణః ( 2 )

**అదేఙ్ గుణః** [1.1.2]

అ(త్), ఏ, ఓ – ఈ మూడు వర్ణములకు 'గుణః' అను సంజ్ఞ ప్రవర్తించును.

## సంయోగః ( 3 )

**హలోఽనన్తరాః సంయోగః** [1.1.7]

స్వరములు కానీ, విరామము కానీ వ్యవధానము లేకుండా ఉచ్చరించబడు హల్లులకు 'సంయోగః' అను సంజ్ఞ.

## అనునాసిక ( 4 )

**ముఖనాసికావచనోఽనునాసికః** [1.1.8]

వర్ణములు ఉచ్చరించునప్పుడు ఆయా ముఖస్థానముతో పాటు నాసికతో కలిపి ఉచ్చరించినప్పుడు ఆ వర్ణమునకు 'అనునాసిక' సంజ్ఞ.

## సవర్ణమ్ ( 5 )

**తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్** [ 1.1.9 ]

ముఖమున ఉచ్చారణస్థానము. ఉచ్చారణకు చేసే ఆభ్యంతర ప్రయత్నము సమానమైన వర్ణములకు పరస్పరముగా 'సవర్ణ' సంజ్ఞ పొందును.

**నాజ్ఝలౌ** [ 1.1.10 ] **(అప)**

(అపవాద) ముఖమున ఉచ్చారణస్థానము, ఉచ్చారణకు చేసే ఆభ్యంతర ప్రయత్నము సమానమైనమైనను స్వరములకు వ్యంజనములకు సవర్ణ సంజ్ఞ ఉండదు.

## ప్రగృహ్యమ్ ( 6 )

**ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్** [1.1.11]

ద్వివచనమై, దీర్ఘ ఈకార, ఊకార, ఏకారాంతములైన రూపములకు 'ప్రగృహ్య'సంజ్ఞ.

**అదసో మాత్** [1.1.12]

'అదస్' శబ్దరూపములందు అంతమందు 'మీ', 'మూ' 'మే' అను వర్ణములలో ఏదైనా ఉన్నచో దానికి 'ప్రగృహ్య'సంజ్ఞ. (ఇక్కడ పై సూత్రములో వలె ద్వివచన నియమము లేదు కానీ మకారము తరువాత దీర్ఘ ఈకార, ఊకార, ఏకారాంతములు చెప్పబడ్డవి)

**శే [1.1.13]**

వైదిక ప్రయోగములలో చతుర్థీ బహువచన ప్రత్యయస్థానములో వచ్చు ఆదేశమైన 'శే' తో సిద్ధించిన పదములకు 'ప్రగృహ్య'సంజ్ఞ.

**నిపాత ఏకాజనాజ్ [1.1.14]**

ఆజ్ కానటువంటి, వ్యంజన రహితమైన నిపాతలు ఏకాచ్ అయినచో (అ,ఇ,ఉ ఇలా) వాటికి ప్రగృహ్య సంజ్ఞ.

**ఓత్ [1.1.15]**

ఓకారాంతమైన నిపాతలకు, అనేకాచ్ హల్లులున్నా కూడా, ప్రగృహ్య సంజ్ఞ.

**సమ్బుద్ధౌ శాకల్యస్యేతావనార్షే [1.1.16]**

శాకల్యుని మతమున – లౌకిక ప్రయోగములో సంబోధన ఏకవచన రూపములోని 'ఇతి' పరముగా ఉన్న 'ఓ'కారమునకు ప్రగృహ్య సంజ్ఞ. (ఓత్ 1.1.15 లో నిత్యముగా చెప్పినది ఇక్కడ వికల్పముగా చెప్పబడినది)

**ఉఞః [1.1.17]**

శాకల్యుని మతమున – లౌకిక ప్రయోగములో 'ఇతి' పరముగా ఉన్న 'ఉఞ్' అన్న నిపాతకు ప్రగృహ్య సంజ్ఞ. (వికల్పముగా అని అర్థం)

**ఈదూతౌ చ సప్తమ్యర్థే [1.1.19]**

సప్తమ్యర్థమున ప్రయుక్తమైన ఈకారాన్త, ఊకారాన్త శబ్దమునకు ప్రగృహ్య సంజ్ఞ. ( సప్తమీ కనబడకున్నా ఆ అర్థములో ఉన్నా –సోమో గౌరీ(సప్తమ్యర్థం) అధిశ్రితః)

## ఘు ( 7 )

**దాధా ఘ్వదాప్ [1.1.20]**

'దాప్' మరియు 'దైప్' అను రెండు ధాతువులు తప్ప, మిగిలిన 'దా', 'ధా' రూపములైన అన్ని ధాతువులు ఘు సంజ్ఞ కలిగినవి. (అదాప్ అన్నప్పుదు దైప్ ఎలా? అంటే ఉపదేశములోని ధాతువులలోని ఏచ్ లకు దీర్ఘ ఆ కారము వస్తుంది కనుక).

## ఘ ( 8 )

**తరప్తమపౌ ఘః [1.1.22]**

'తరప్' మరియు 'తమప్' అను ప్రత్యయములు ఘ సంజ్ఞ కలిగినవి.

## సంఖ్యా ( 9 )

**బహుగణవతుడతి సంఖ్యా [1.1.23]**

'బహు' 'గణ' శబ్దములు, అట్లే 'వతుఀప్' మరియు 'డతి' ప్రత్యయాంత శబ్దములకు 'సంఖ్యా' అను సంజ్ఞ.

## షట్ ( 10 )

**ష్ణాన్తా షట్ [1.1.24]**

షకార, నకారాంతములగు సంఖ్యావాచక శబ్దములకు 'షట్' అను సంజ్ఞ. షట్ అంటే ఆరు అని అర్థము కాదు అని గమనించవలెను. (సూత్రములో ణకారము కనబడుతున్నది మరి నకారాంతములన్నారంటే షకారోత్తర నకారముకు ణత్వము వస్తుంది కనుక)

**డతి చ [1.1.25]**

'డతి' ప్రత్యయాన్తమైన సంఖ్యావాచక శబ్దములకు 'షట్' అను సంజ్ఞ.

## నిష్ఠా ( 11 )

**క్తక్తవతూ నిష్ఠా [1.1.26]**

'క్త' ,'క్తవతు' అను రెండు ప్రత్యయములకు నిష్ఠా సంజ్ఞ.

## సర్వనామ ( 12 )

**సర్వాదీని సర్వనామాని [1.1.27]**

సర్వాదిగణములోని శబ్దములకు 'సర్వనామ' అను సంజ్ఞ.

**విభాషా దిక్సమాసే బహువ్రీహౌ [1.1.28]**

బహువ్రీహి సమాసములో ప్రయుక్తమైన దిశావాచకశబ్దములలో సర్వాదిగణములోని శబ్దములు వికల్పముగా సర్వనామ సంజ్ఞ పొందును.

**విభాషా జసి [1.1.32]**

ద్వంద్వ సమాసములో ప్రయుక్తమైన సర్వాదిగణములోని శబ్దములకు పరముగ జస్ ప్రత్యయము ఉన్నచో వికల్పముగా సర్వనామ సంజ్ఞ పొందును.

**ప్రథమచరమతయాల్పార్ధకతిపయనేమాశ్చ [1.1.33]**

'ప్రథమ', 'చరమ', 'అల్ప', 'అర్ధ', 'కతిపయ', 'నేమ' అను శబ్దములు, అట్లే 'తయప్' ప్రత్యయాన్తశబ్దముల పరముగ జస్ ప్రత్యయము ఉన్నచో వికల్పముగా సర్వనామ సంజ్ఞ పొందును.

**పూర్వపరావరదక్షిణోత్తరాపరాధరాణి వ్యవస్థాయామసంజ్ఞాయామ్ [1.1.34]**

'పూర్వ', 'పర', 'అవర', 'దక్షిణ', 'ఉత్తర', 'అపర', 'అధర' —అను శబ్దములు సంజ్ఞాభిన్నములై, వ్యవస్థార్థములో 'జస్' ప్రత్యయము పరముగా ఉన్నప్పుడు వికల్పముగా సర్వనామ సంజ్ఞ పొందును.(ఉదా- పూర్వ అంటే తూర్పు కి సంజ్ఞ కదా అలా కాకుండా)

**స్వమజ్ఞాతిధనాఖ్యాయామ్ [1.1.35]**

'స్వ' శబ్దము 'బాన్ధవః' మరియు 'ధనమ్' అన్న అర్థమునందుకాక, ఇతరార్థములలో వినియోగించినప్పుడు 'స్వ'శబ్దమునకు 'సర్వనామ' సంజ్ఞ.

**అన్తరం బహిర్యోగోపసంవ్యానయోః [1.1.36]**

బహిర్యోగము అనగా బయట ఉండుట అని అర్థము. ఉపసంవ్యానము అంటే దేహమునకు దిగువభాగమున ధరించు వస్త్రమని అర్థము. ఈ రెండిటి అర్థములో 'అంతర' శబ్దమునకు 'జస్' ప్రత్యయము పరముగా ఉన్నప్పుడు వికల్పముగా సర్వనామ సంజ్ఞ పొందును.

**న బహుహుబ్రీహౌ [1.1.29] (అప)**

(అపవాద) బహుబ్రీహిసమాసగతమైన 'సర్వ' గణ శబ్దములు 'సర్వనామ' సంజ్ఞను పొందవు.

**తృతీయాసమాసే [1.1.30] (అప)**

(అపవాద) తృతీయాతత్పురుషసమాసగతమైన 'సర్వ' గణ శబ్దములు 'సర్వనామ' సంజ్ఞను పొందవు.

తృతీయాసమాసే విద్యమానస్య సర్వాదిగణస్య శబ్దానామ్ 'సర్వనామ' ఇతి సంజ్ఞా న భవతి ।

**ద్వన్ద్వే చ [1.1.31] (అప)**

(అపవాద) ద్వంద్వసమాసగతమైన 'సర్వ' గణ శబ్దములు 'సర్వనామ' సంజ్ఞను పొందవు.

## అవ్యయ ( 13 )

**స్వరాదినిపాతమవ్యయమ్ [1.1.37]**

స్వరాదిగణ శబ్దములు నిపాత సంజ్ఞను, అవ్యయసంజ్ఞను కూడా కలిగియుండును.

**తద్ధితశ్చాసర్వవిభక్తిః [1.1.38]**

తద్ధితాంతశబ్దములకు విభక్తిప్రత్యయములు విధించకుండిన పక్షమున 'అవ్యయ' సంజ్ఞ పొందును.

**కృన్మేజన్తః [1.1.39]**

కృత్ ప్రత్యయాంతమున మకారములకు, 'ఏచ్' అంతములకు 'అవ్యయ' సంజ్ఞ.

**క్త్వాతోసున్కసునః [1.1.40]**

'క్త్వా'ప్రత్యయాన్తశబ్దములు, 'తోసున్' ప్రత్యయాన్తశబ్దములు, 'కసున్' ప్రత్యయాన్తశబ్దములు కూడా అవ్యయ సంజ్ఞ పొందును.

**అవ్యయీభావశ్చ [1.1.41]**

అవ్యయీభావసమాసములో సిద్ధించిన శబ్దములకు 'అవ్యయ' సంజ్ఞ.

## సర్వనామస్థానమ్ ( 14 )

**శి సర్వనామస్థానమ్ [1.1.42]**

ప్రత్యయము లేదా ఆదేశముగా వచ్చిన 'శి' వర్ణమునకు 'సర్వనామస్థాన' సంజ్ఞ.

**సుడనపుంసకస్య [1.1.43]**

నపుంసకలింగశబ్దములు కానప్పుడు వాటికి విధించే విభక్తి ప్రత్యయాలలో 'సుఁ', 'ఔ', 'జస్', 'అమ్', 'ఔట్' ప్రత్యయములకు 'సర్వనామస్థాన' సంజ్ఞ.

## విభాషా ( 15 )

**న వేతి విభాషా [1.1.44]**

నిషేధమును వికల్పమును సూచించుటకు 'విభాషా' సంజ్ఞ.

## సమ్ప్రసారణమ్ ( 16 )

**ఇగ్యణః సమ్ప్రసారణమ్** [1.1.45]

యణ్ వర్ణముల స్థానమునందు విధించు 'ఇక్' వర్ణమునకు 'సమ్ప్రసారణమ్' సంజ్ఞ.

## లోపః ( 17 )

**అదర్శనం లోపః** [1.1.60]

ఏదేని వర్ణము అదర్శనమైనను, వినబడకున్నను, ఉచ్చరించకున్నను 'లోపః' అనబడును.

## లుక్ ( 18 )

**ప్రత్యయస్య లుక్శ్లులుపః** [1.1.61]

ప్రత్యయమునకు లోపమును సూచించుటను సూచించు 'లుక్', 'శ్లు', 'లుప్' శబ్దములకు వరుసగా 'లుక్', 'శ్లు', 'లుప్' సంజ్ఞలను పొందును.

## లుప్ ( 19 )

**ప్రత్యయస్య లుక్శ్లులుపః** [1.1.61]

ప్రత్యయమునకు లోపమును సూచించుటను సూచించు 'లుక్', 'శ్లు', 'లుప్' శబ్దములకు వరుసగా 'లుక్', 'శ్లు', 'లుప్' సంజ్ఞలను పొందును.

## శ్లు ( 20 )

**ప్రత్యయస్య లుక్శ్లులుపః** [1.1.61]

ప్రత్యయమునకు లోపమును సూచించుటను సూచించు 'లుక్', 'శ్లు', 'లుప్' శబ్దములకు వరుసగా 'లుక్', 'శ్లు', 'లుప్' సంజ్ఞలను పొందును.

## టి ( 21 )

**అచోఽన్త్యాది టి** [1.1.64]

శబ్దములోని చివరి అచ్చు మొదలు తదనంతరమున్న అన్ని వర్ణమువరకు ఉన్న వర్ణ సమూహమునకు 'టి' సంజ్ఞ.

## ఉపధా ( 22 )

**అలోఽన్త్యాత్ పూర్వ ఉపధా** [1.1.65]

శబ్దమునందలి అంతిమవర్ణముకంటే పూర్వమునందున్న వర్ణమునకు 'ఉపధా' సంజ్ఞ.

## ప్రత్యాహార ( 23 )

**ఆదిరన్త్యేన సహేతా** [ 1.1.71]

మాహేశ్వర సూత్రాలలోని వర్ణములలోని ఏదైన వర్ణము మొదలుగా, స్వీకరించిన ఇత్ వర్ణముతో కలిపిన దానికి ప్రత్యాహార సంజ్ఞ.

## వృద్ధః ( 24 )

**వృద్ధిర్యస్యాచామాదిస్తద్ వృద్ధమ్** [1.1.73]

శబ్దమునకు ప్రథమస్వరము వృద్ధిసంజ్ఞకమైనచో ఆ శబ్దమునకు 'వృద్ధః' సంజ్ఞ.

**త్యదాదీని చ** [1.1.74]

సర్వాదిగణములోని త్యద్ శబ్దమునుండి ఆ గణము చివరివరకు గల శబ్దములకు సర్వనామ సంజ్ఞతో పాటు 'వృద్ధః' సంజ్ఞ కలదు.

**ఏఙ్ ప్రాచాం దేశే** [1.1.75]

పూర్వదిశనందు గల దేశము పేరులోని తొలి స్వరము 'ఏ' లేక 'ఓ' అయినచో 'వృద్ధ:' సంజ్ఞ. కొందరు శరావతీ నది ప్రాతిపదికగా పూర్వ, పశ్చిమాది దిక్కు గుర్తిస్తారని చెప్తారు.

## హ్రస్వ ( 25 )

**ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః** [1.2.27]

చిటికె వేయుటకు పట్టు కాలము ఒక మాత్రాకాలము అనుకుంటే, ఒక అచ్చుని ఉచ్చరించుటకు ఒకమాత్రాకాలము పట్టిన హ్రస్వ సంజ్ఞ, రెండుమాత్రల కాలమునకు దీర్ఘ సంజ్ఞ, మూడు లేక అంతకన్నా ఎక్కువ మాత్రల కాలానికి ప్లుత సంజ్ఞ.

## దీర్ఘ ( 26 )

**ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః** [1.2.27]

చిటికె వేయుటకు పట్టు కాలము ఒక మాత్రాకాలము అనుకుంటే, ఒక అచ్చుని ఉచ్చరించుటకు ఒకమాత్రాకాలము పట్టిన హ్రస్వ సంజ్ఞ, రెండుమాత్రల కాలమునకు దీర్ఘ సంజ్ఞ, మూడు లేక అంతకన్నా ఎక్కువ మాత్రల కాలానికి ప్లుత సంజ్ఞ.

## ప్లుత ( 27 )

**ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః** [1.2.27]

చిటికె వేయుటకు పట్టు కాలము ఒక మాత్రాకాలము అనుకుంటే, ఒక అచ్చుని ఉచ్చరించుటకు ఒకమాత్రాకాలము పట్టిన హ్రస్వ సంజ్ఞ, రెండుమాత్రల కాలమునకు దీర్ఘ సంజ్ఞ, మూడు లేక అంతకన్నా ఎక్కువ మాత్రల కాలానికి ప్లుత సంజ్ఞ.

## ఉదాత్తః ( 28 )

**ఉచ్చైరుదాత్తః** [1.2.29]

స్వరముల యొక్క ఉచ్చారణసమయమున ఆ ఉచ్చారణస్థానానికి ఊర్ధ్వభాగమునుండి పలికితే దానికి 'ఉదాత్తః' సంజ్ఞ.

## అనుదాత్తః ( 29 )

**నీచైరనుదాత్తః** [1.2.30]

స్వరముల యొక్క ఉచ్చారణసమయమున ఆ ఉచ్చారణస్థానానికి క్రిందిభాగమునుండి పలికితే దానికి 'అనుదాత్తః' సంజ్ఞ.

## స్వరితః ( 30 )

**సమాహారః స్వరితః** [1.2.31]

స్వరముల యొక్క ఉచ్చారణసమయమున ఆ ఉచ్చారణస్థానానికి ఊర్ధ్వభాగమును, అధోభాగమును కూడా ఉపయోగించిన 'స్వరిత:' సంజ్ఞ.

## అప్పృక్త ( 31 )

**అప్పృక్త ఏకాల్ ప్రత్యయః** [1.2.41]

ప్రత్యయమునందు కేవలము ఒకే వర్ణమున్నా, లేదా ఇత్ వర్ణములు లోపించగా చివరకు కేవలం ఒకే వర్ణము (ఉదాః స్, త్,) శేషించిన అట్టి వర్ణమునకు 'అపృక్తః' సంజ్ఞ.

## కర్మధారయ ( 32 )

**తత్పురుషః సమానాధికరణః కర్మధారయః** [ 1.2.42 ]

తత్పురుషసమాసములోని పూర్వోత్తరపదములు సమానాధికరణము కలిగియున్న 'కర్మధారయ' సంజ్ఞ.

## ఉపసర్జనమ్ ( 33 )

**ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్** [ 1.2.43 ]

సమాసములను విధించు సూత్రములలోని ప్రథమా నిర్దిష్టమైన శబ్దమునకు 'ఉపసర్జన' సంజ్ఞ.

**ఏకవిభక్తి చాపూర్వనిపాతే** [ 1.2.44 ]

సమాసములో ఒక పదము అనేకవిభక్తులలో ఉన్నప్పటికి, మరియొక పదము నియతముగా ఒకే విభక్తిలో ఉన్నచో అట్టి నియతమైన విభక్త్యంత పదమునకు 'ఉపసర్జన' సంజ్ఞ. ( ఉపసర్జన వల్ల రావలసిన పూర్వనిపాత రాదు అని సూత్రార్థము)

## ప్రాతిపదికమ్ ( 34 )

**అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్** [1.2.45]

అర్థవంతములై, ధాతు,ప్రత్యయ,ప్రత్యయాంతమును కానటువంటి శబ్దములకు 'ప్రాతిపదికమ్' అను సంజ్ఞ.

**కృత్తద్ధితసమాసాశ్చ** [1.2.46]

కృత్ ప్రత్యయాంత శబ్దములు, తద్ధితప్రత్యయాంత శబ్దములు, సమాసశబ్దములకు 'ప్రాతిపదికమ్' అను సంజ్ఞ.

## ధాతు ( 35 )

**భూవాదయో ధాతవః** [1.3.1]

'భూ'మొదలగు క్రియావాచకములైన శబ్దములకు 'ధాతు' సంజ్ఞ.

**సనాద్యన్తా ధాతవః** [3.1.32]

సనాదిప్రత్యయాంత శబ్దములకు 'ధాతు' సంజ్ఞ.

## ఇత్ ( 36 )

**ఉపదేశేఽజనునాసిక ఇత్** [1.3.2]

ఉపదేశమనగా ఆద్యోచ్చారణము. ఉపదేశమునందు కల అనునాసిక స్వరములకు 'ఇత్' సంజ్ఞ. (ఈ అనునాసిక స్వరము ఉపదేశమునందు ఆది, అంతము అని కాక ఎక్కడనైన ఉండవచ్చును)

**హలన్త్యమ్** [1.3.3]

ఉపదేశమునందు అంత్యమందున్న హల్ వర్ణమునకు 'ఇత్' సంజ్ఞ.

**ఆదిర్ఞిటుడవః** [1.3.5]

ఉపదేశమునందు ఆదియందున్న 'ఞి', 'టు', 'డు' వర్ణములకు 'ఇత్' సంజ్ఞ.

**షః ప్రత్యయస్య** [1.3.6]

ఉపదేశమునందలి ప్రత్యయమునకు ఆదినందు కల షకారమునకు 'ఇత్' సంజ్ఞ.

**చుటూ** [1.3.7]

ఉపదేశమునందలి ప్రత్యయమునకు ఆదినందుకల చవర్గ, టవర్గ వర్ణములకు 'ఇత్' సంజ్ఞ.

**లశక్వతద్ధితే** [1.3.8]

ఉపదేశమునందలి తద్ధితములుకాని ప్రత్యయమునకు ఆదినందుకల లకార, శకార, కవర్గ వర్ణములకు 'ఇత్' సంజ్ఞ.

**న విభక్తౌ తుస్మాః** [1.3.4] **(అప)**

(అపవాద) ఉపదేశమునందు ప్రత్యయమునకు విభక్తి సంజ్ఞ కలిగినప్పుడు అంత్యమందున్న తవర్గవర్ణములు, సకార, మకారములకు 'ఇత్' సంజ్ఞ ప్రవర్తించదు.

## నదీ ( 37 )

**యూ స్త్ర్యాఖ్యౌ నదీ** [1.4.3]

దీర్ఘ 'ఈ'కారాంత, దీర్ఘ 'ఊ'కారాంత నిత్యస్త్రీలింగ వాచకములైన శబ్దములకు 'నదీ' సంజ్ఞ.

**ఙితి హ్రస్వశ్చ** [1.4.6]

హ్రస్వ ఇకారాన్త, హ్రస్వ ఉకారాన్తములైన నిత్యస్త్రీలిఙ్గశబ్దములు అట్లే 'స్త్రీ' శబ్దం విడిచి ఇతర ఈకారాన్త/ ఊకారాన్త ఇయఙ్, అవఙ్ ఆదేశము వచ్చు అవకాశము ఉన్న నిత్యస్త్రీలిఙ్గశబ్దములకు ఙిత్ ప్రత్యయము పరముగా ఉన్నప్పుడు వికల్పముగా 'నదీ' సంజ్ఞ పొందును.

**వాఽఽమి** [1.4.5]

'స్త్రీ' శబ్దం విడిచి ఇతర ఈకారాన్త/ ఊకారాన్త ఇయఙ్, అవఙ్ ఆదేశము వచ్చు అవకాశము ఉన్న నిత్యస్త్రీలిఙ్గశబ్దములకు ఆమ్ ప్రత్యయము పరముగా ఉన్నప్పుడు వికల్పముగా 'నదీ' సంజ్ఞ పొందును.

**నేయఙువఙ్స్థానావస్త్రీ** [1.4.4] **(అప)**

(అపవాద) 'స్త్రీ' శబ్దం విడిచి ఇతర ఈకారాన్త/ ఊకారాన్త ఇయఙ్, అవఙ్ ఆదేశము వచ్చు అవకాశము ఉన్న నిత్యస్త్రీలిఙ్గశబ్దములకు 'నదీ సంజ్ఞ రాదు.

## ఘి ( 38 )

**శేషో ఘ్యసఖి** [1.4.7]

సఖి శబ్దం తప్పించి నదీసంజ్ఞ పొందని మిగిలిన హ్రస్వ 'ఇ'కారాన్త, 'ఉ'కారాన్త శబ్దములకు 'ఘి' సంజ్ఞ.

**పతిః సమాస ఏవ** [1.4.8]

సమాసమునందు ప్రయుక్తమైన పతి శబ్దమునకు మాత్రమే 'ఘి' సంజ్ఞ. సమాసములో రాకున్న ఘి సంజ్ఞ ప్రవర్తించదు.

**షష్ఠీయుక్తశ్ఛన్దసి వా** [1.4.9]

వైదికప్రయోగములలో షష్ఠీతత్పురుషసమాసములో 'పతి' శబ్దమునకు వికల్పముగా ఘి సంజ్ఞ.

## లఘు ( 39 )

**హ్రస్వం లఘు**[1.4.10]

హ్రస్వస్వరము కలిగిన వర్ణమునకు 'లఘు' సంజ్ఞ.

## గురు ( 40 )

**సంయోగే గురు** [1.4.11]

సంయోగ సంజ్ఞగల వర్ణసముదాయము పరముగా ఉన్న హ్రస్వస్వరము కలిగిన వర్ణమునకు 'గురు' సంజ్ఞ.

**దీర్ఘం చ** [1.4.12]

దీర్ఘస్వరము కలిగిన వర్ణమునకు 'గురు' సంజ్ఞ.

## అఙ్గమ్ ( 41 )

**యస్మాత్ ప్రత్యయవిధిస్తదాది ప్రత్యయేఽఙ్గమ్** [1.4.13]

ఒక శబ్దమునకు ప్రత్యయము విధించబడినప్పుడు ఆ శబ్దము మొత్తమునకు అంగసంజ్ఞ వస్తుంది.

## పదమ్ ( 42 )

**సుప్తిఙన్తం పదమ్** [1.4.14]

సుప్ ప్రత్యయములు, తిఙ్ ప్రత్యయములు చేర్చగా వచ్చిన ప్రత్యయాంత రూపాలకు 'పదమ్' అన్న సంజ్ఞ.

**నః క్యే** [1.4.15]

నకారాంత శబ్దముకంటే పరముగా 'క్య' శబ్దము ఉన్నచో నకారాంతశబ్దమునకు పదసంజ్ఞ.

**సితి చ** [1.4.16]

ప్రత్యయము సిత్ అయినచో పూర్వమున్న శబ్దమునకు పదసంజ్ఞ వస్తుంది.

**స్వాదిష్వసర్వనామస్థానే** [1.4.17]

సర్వనామస్థానసంజ్ఞ కాని సుబాది ప్రత్యయములు పరమైనప్పుడు ప్రాతిపదికమునకు 'పద' సంజ్ఞ.

**అయస్మయాదీని చ్ఛన్దసి** [1.4.20]

'అయస్మయ' ఇత్యాది శబ్దములు వేదములో భసంజ్ఞను, పదసంజ్ఞను కూడ వీలువెంట పొందును.

## భ ( 43 )

**యచి భమ్** [1.4.18]

సర్వనామస్థానసంజ్ఞలు కాని సుబాది ప్రత్యయములు మొదలు కప్ ప్రత్యయాంతము యకారాది కానీ అజాది కానీ అయిన ప్రత్యయములకు ముందున్న శబ్దమునకు భ సంజ్ఞ.

**తసౌ మత్వర్థే** [1.4.19]

మత్వర్థ ప్రత్యయములు పరమైనప్పుడు తకారాంత, సకారాంతములైన శబ్దములకు భ సంజ్ఞ.

**అయస్మయాదీని చ్ఛన్దసి** [1.4.20]

'అయస్మయ' ఇత్యాది శబ్దములు వేదములో భసంజ్ఞను, పదసంజ్ఞను కూడ వీలువెంట పొందును.

[6.4.129 ] సూత్రము నుండి ఆరవ అధ్యాయము పరిసమాప్తి వరకు చెప్పబడినవి 'భ' సంజ్ఞకములు.

**సితి చ** [1.4.16] **(అప)**

(అపవాద) యజాది ప్రత్యయమైనను, ఆ ప్రత్యయము సిత్ అయినచో పూర్వమున్న శబ్దమునకు భసంజ్ఞను బాధించి పదసంజ్ఞ వస్తుంది.

## కారక ( 44 )

కారకే [ 1.4.23 ]

ఇది అధికార సూత్రము, సంజ్ఞా సూత్రము కూడా. ఇటుపై చెప్పబడే అపాదానాది సంజ్ఞలకు ఈ సంజ్ఞ జతబడి ఉంటుంది.

## అపాదానమ్ ( 45 )

**ధ్రువమపాయేఽపాదానమ్** [ 1.4.24 ]

అపాయమనగా విశ్లేషణ లేక విడివడుట. దేనినుండి విడివడునో అట్టి విడివడుటకు కారణమైన వస్తువునకు 'అపాదాన' సంజ్ఞ.

**భీత్రార్థానాం భయహేతుః** [ 1.4.25 ]

భయము, రక్షించుట అనునవి సూచించు ధాతువుల ప్రయోగములో భయహేతువైన కారకమునకు 'అపాదాన' సంజ్ఞ.

**పరాజేరసోఢః** [ 1.4.26 ]

'పరా' శబ్దపూర్వకముగా 'జి' ధాతువు ప్రయోగించినప్పుడు, అది సహింపలేనట్టిదను అర్థము స్ఫురింపచేసినప్పుడు కారకమునకు 'అపాదాన' సంజ్ఞ.

**వారణార్థానామీప్సితః** [ 1.4.27 ]

ఒక ప్రవృత్తికి విఘాతము కలిగించుటయే వారించుట. అట్లు వారించుట అను అర్థము గల ధాతువు ప్రయోగించినప్పుడు దేనినుండి వారించబడినదో అట్టి ఈప్సితమైన (ఇష్టమైన) కారకమునకు 'అపాదాన' సంజ్ఞ.

**అన్తర్ధౌ యేనాదర్శనమిచ్ఛతి** [ 1.4.28 ]

వ్యవధానము కొరకు ఎవరినుండి కనబడుటకు ఇష్టపడడో అట్టివారిని తెలిపే కారకమునకు 'అపాదాన' సంజ్ఞ.

**ఆఖ్యాతోపయోగే** [ 1.4.29 ]

ఒక నియమముగా విద్యను స్వీకరించునపుడు, ఎవరివద్ద స్వీకరిస్తున్నారో అట్టివారిని తెలిపే కారకమునకు 'అపాదాన' సంజ్ఞ.

**జనికర్తుః ప్రకృతిః** [ 1.4.30 ]

జననము లేక ఉత్పత్తికి హేతువు లేక కర్తని జనికర్తుః అంటారు. అట్టివారిని తెలిపే కారకమునకు 'అపాదాన' సంజ్ఞ.

**భువః ప్రభవః** [ 1.4.31 ]

ఏదైనా మొదటిసారిగా ప్రకాశములోని వచ్చుటకు భవనం అందురు. అట్టి తొలిప్రకాశ స్థానమును తెలిపే కారకమునకు 'అపాదాన' సంజ్ఞ.

## సమ్ప్రదానమ్ ( 48 )

**కర్మణా యమభిప్రైతి స సమ్ప్రదానమ్** [ 1.4.32 ]

దానము అను కర్మతో సంబంధము కలుగజేయుటకు ఉద్దేశించబడినదానికి 'సంప్రదానమ్' అను సంజ్ఞ. (దానము అనగా కర్త దానము చేసినవస్తువునందు తన సర్వహక్కులను విడిచివేయుట)

**రుచ్యర్థానాం ప్రీయమాణః** [ 1.4.33 ]

ప్రీతి/ ఇష్టము అను అర్థముగల ధాతువులు ప్రయోగించినప్పుడు అట్టి ప్రీతి/ఇష్టము కలుగజేయుదానికి 'సంప్రదాన' సంజ్ఞ.

**శ్లాఘహ్నుఙ్స్థాశపాం జ్ఞీప్స్యమానః** [ 1.4.34 ]

శ్లా, హ్నుఙ్, స్థా, శప్ అను ఈ నాలుగు ధాతువులు ప్రయోగించినప్పుడు బోధింపనిష్టమైన దానికి 'సంప్రదాన' సంజ్ఞ.

**ధారేరుత్తమర్ణః** [ 1.4.35 ]

ధారి ధాతువుకంటే ఋణము ఎవరికి తీర్చవలెనో తెలుపు వానికి 'సంప్రదాన' సంజ్ఞ ప్రవర్తించును.

**స్పృహేరీప్సితః** [ 1.4.36 ]

స్పృహ ఈప్సాయాం అను ధాతువుకంటే ఏది కోరుకోబడినదో తెలుపు దానికి 'సంప్రదాన' సంజ్ఞ ప్రవర్తించును.

**క్రుధద్రుహేర్ష్యాఽసూయార్థానాం యం ప్రతి కోపః** [ 1.4.37 ]

క్రుధ, ద్రుహ, ఈర్ష్యా, అసూయ అను అర్థముకల ధాతువుకంటే ఎవరిని ఉద్దేశించినదో తెలుపు దానికి 'సంప్రదాన' సంజ్ఞ ప్రవర్తించును.

**రాధీక్ష్యోర్యస్య విప్రశ్నః** [ 1.4.39 ]

రాధ్, ఈక్ష్ అను ధాతువుకంటే ఎవరి అదృష్ట/దురదృష్టములగురించి ప్రశ్నించబడెనో (విప్రశ్న) వానికి 'సంప్రదాన' సంజ్ఞ ప్రవర్తించును.

**ప్రత్యాఙ్భ్యాం శ్రువః పూర్వస్య కర్తా** [ 1.4.40 ]

ప్రతి, ఆఙ్ అను ఉపసర్గపూర్వక శృ ధాతువుకు కారణమైన పూర్వకర్తకు 'సంప్రదాన' సంజ్ఞ ప్రవర్తించును.

**అనుప్రతిగృణశ్చ** [ 1.4.41 ]

అను, ప్రతి అను ఉపసర్గపూర్వక గృ ధాతువుకు కారణమైన పూర్వకర్తకు 'సంప్రదాన' సంజ్ఞ ప్రవర్తించును.

**పరిక్రయణే సమ్ప్రదానమన్యతరస్యామ్** [ 1.4.44 ]

పరిక్రయణము (జీతమునిచ్చి ఒకరిని కొంతకాలమునకు స్వీకరించుట) అను అర్థములో దానికి సంప్రదానసంజ్ఞ, మరియు కరణ సంజ్ఞ రెండును ప్రవర్తించును.

## కరణ ( 47 )

**సాధకతమం కరణమ్** [ 1.4.42 ]

క్రియాసిద్ధినందు అత్యంత ఉపయుక్తమైనదిగా వివక్షచేయబడినది సాధకతమము. అట్టి సాధకతమమైనట్టి కారకమునకు 'కరణ' సంజ్ఞ ప్రవర్తించును.

**దివః కర్మ చ** [ 1.4.43 ]

దివ్ క్రియలో అత్యంత కారకమైనవి అక్షలు. దానికి కర్మ సంజ్ఞ, మరియు కరణ సంజ్ఞ రెండును ప్రవర్తించును.

**పరిక్రయణే సమ్ప్రదానమన్యతరస్యామ్** [ 1.4.44 ]

పరిక్రయణము (జీతమునిచ్చి ఒకరిని కొంతకాలమునకు స్వీకరించుట) అను అర్థములో దానికి సంప్రదానసంజ్ఞ, మరియు కరణ సంజ్ఞ రెండును ప్రవర్తించును.

## అధికరణ ( 48 )

**ఆధారోఽధికరణమ్** [ 1.4.45 ]

ఆధారమనగా క్రియలు ఎక్కడ ఆధారితాలైయుంటాయో అది. అట్టి ఆధారమునకు 'అధికరణ' సంజ్ఞ ప్రవర్తించును.

## కర్మ ( 49 )

**క్రుధద్రుహోరుపసృష్టయోః కర్మ** [ 1.4.38 ]

క్రుధ, ద్రుహ అను అర్థముకల ధాతువులు ఉపసర్గతో కూడినప్పుడు ఎవరిని ఉద్దేశించినదో తెలుపు దానికి 'కర్మ' సంజ్ఞ ప్రవర్తించును.

**దివః కర్మ చ** [ 1.4.43 ]

దివ్ క్రియలో అత్యంత కారకమైనవి అక్షలు.  దానికి కర్మ సంజ్ఞ, మరియు కరణ సంజ్ఞ రెండును ప్రవర్తించును.

**అధిశీఙ్స్థాఽఽసాం కర్మ** [ 1.4.46 ]

అధిపూర్వకమైన శీఙ్, స్థా, ఆస్ అనువానికి ఏది ఆధారమో వానికి కర్మసంజ్ఞ.

**అభినివిశశ్చ** [ 1.4.47 ]

అభి, ని ఉపసర్గ పూర్వకమైన విశ్ ధాతువునకు ఏది ఆధారమో వానికి కర్మసంజ్ఞ.

**ఉపాన్వధ్యాఙ్వసః** [ 1.4.48 ]

ఉప,అను, అధి, అ అను ఉపసర్గపూర్వకమైన వస్ ధాతువునకు ఏది ఆధారమో వానికి కర్మసంజ్ఞ.

**కర్తురీప్సితతమం కర్మ** [ 1.4.49 ]

కర్తకు చేయు పనియందు ఏది మిక్కిలి ఇష్టమైనదో ఆ కారకమునకు 'కర్మ' సంజ్ఞ.

**తథాయుక్తం చానీప్సితమ్** [ 1.4.50 ]

కర్తకు చేయు పనియందు ఏది అనిష్టమైనదో ఆ కారకమునకు 'కర్మ' సంజ్ఞ.

**అకథితం చ** [ 1.4.51 ]

అపాదానాది ఇతర కారకములతో విశేషించి చెప్పబడని కారకమునకు 'కర్మ' సంజ్ఞ.

**గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకాణామణి కర్తా స ణౌ** [ 1.4.52 ]

గతి,బుద్ధి, భక్షణ , శబ్దకర్మక్రియలు, అకర్మక క్రియలు వీటికి ప్రయోజ్యకర్తకు ణిచ్ ప్రయోగములో 'కర్మ' సంజ్ఞ.

**హృక్రోరన్యతరస్యామ్** [ 1.4.53 ]

ణిజంతము కానప్పుడు హృ, కృ ధాతువులకు కర్తగా ఉన్నది  ణ్యంత ప్రయోగములో అట్టి కర్తకు వికల్పముగా 'కర్మ' సంజ్ఞ.

## కర్తృ ( 50 )

**స్వతన్త్రః కర్తా** [ 1.4.54 ]

స్వతంత్రుడు అనగా ప్రధానుడు లేక ముఖ్యుడు అని తాత్పర్యము.  క్రియాసిద్ధియందు అట్టి స్వతంత్రునికి 'కర్తృ' సంజ్ఞ ప్రవర్తించును.

**తత్ప్రయోజకో హేతుశ్చ** [ 1.4.55 ]

హేతువు అనగా కర్తను క్రియాసిద్ధికి ప్రేరేపించునది అని భావము. అట్టి ప్రయోజక కారకమునకు 'కర్తృ' సంజ్ఞ, 'హేతు' సంజ్ఞ ప్రవర్తించును.

## హేతు ( 51 )

**తత్ప్రయోజకో హేతుశ్చ** [ 1.4.55 ]

హేతువు అనగా కర్తను క్రియాసిద్ధికి ప్రేరేపించునది అని భావము. అట్టి ప్రయోజక కారకమునకు 'కర్తృ' సంజ్ఞ, 'హేతు' సంజ్ఞ ప్రవర్తించును.

## నిపాత ( 52 )

**స్వరాదినిపాతమవ్యయమ్** [1.1.37]

స్వరాదిగణ శబ్దములు నిపాత సంజ్ఞను, అవ్యయసంజ్ఞను కూడా కలిగియుండును.

**ప్రాగ్రీశ్వరాన్నిపాతాః** [ 1.4.56 ]

ఇది అధికార సూత్రము, సంజ్ఞా సూత్రము కూడా. 'అధిరీశ్వరే [1.4.97]' వరకు ఇటుపై చెప్పబడునవన్ని నిపాతసంజ్ఞ.

**చాదయోఽసత్త్వే** [1.4.57]

అద్రవ్యవాచకములైన చాదిగణములోని శబ్దములకు 'నిపాత' సంజ్ఞ.

**ప్రాదయః** [ 1.4.58 ]

అద్రవ్యవాచకములైన ప్రాది (ప్రా మొదలగునవి) శబ్దములకు 'నిపాత' సంజ్ఞ.

**ఉపసర్గాః క్రియాయోగే** [ 1.4.59 ]

ప్రాదులు క్రియతో కలిసినప్పుడు 'నిపాత' సంజ్ఞతో పాటు 'ఉపసర్గ' సంజ్ఞ.

**గతిశ్చ** [ 1.4.60 ]

ప్రాదులు క్రియతో కలిసినప్పుడు 'నిపాత' సంజ్ఞతో పాటు 'ఉపసర్గ' సంజ్ఞతో పాటు 'గతి' సంజ్ఞను కూడా పొందును.

**ఊర్యాదిచ్విడాచశ్చ** [1.4.61]

ఊర్యాదిగణములోని శబ్దములు, చ్వి, డాచ్ ప్రత్యయాంత శబ్దములు క్రియతో కూడియున్న నిపాత సంజ్ఞ, గతి సంజ్ఞ కూడా పొందును.

**అనుకరణం చానితిపరమ్** [ 1.4.62 ]

'ఇతి' శబ్దము లేకుండ అనుకరణం అను అర్థములో ప్రయోగించినప్పుడు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**ఆదరానాదరయోః సదసతీ** [ 1.4.63 ]

ఆదరము అను అర్థములో సత్, అనాదరము అను అర్థములో అసత్ శబ్దములు క్రియాయోగములో ప్రయోగించినప్పుడు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి'సంజ్ఞ.

**భూషణేఽలమ్** [ 1.4.64 ]

అలమ్ అను శబ్దానికి అనేకార్థములు. అందులో భూషణము అని ఒకటి. అట్టి భూషణార్థములో క్రియాయోగములో ప్రయోగించినప్పుడు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి'సంజ్ఞ.

**అన్తరపరిగ్రహే [ 1.4.65 ]**

పరిగ్రహము అంటే స్వీకరించుట అని అర్థం. అలా పరిగ్రహార్థములో కాకుండ ఇతర అర్థములలో 'అంతః' శబ్దమునకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**కణేమనసీ శ్రద్ధాప్రతీఘాతే [ 1.4.66 ]**

కోరిక తీర్చుకోవటం అనే అర్థములో క్రియాయోగము కలిగిన 'కణే', 'మనస్' శబ్దములకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**పురోఽవ్యయమ్ [ 1.4.67 ]**

అవ్యయమైన అసిప్రత్యయాంతమైన పురస్ శబ్దమునకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**అస్తం చ [ 1.4.68 ]**

అవ్యయమైనప్పుడు మకారాంతమైన అస్తమ్ శబ్దము క్రియాయోగములో 'నిపాత' సంజ్ఞతోపాటు అనుపలబ్ధి అను అర్థమున మాత్రమే 'గతి' సంజ్ఞ.

**అచ్ఛ గత్యర్థవదేషు [ 1.4.69 ]**

అవ్యయమైన అచ్ఛ శబ్దము గత్యర్థకధాతువులు, వద ధాతువు పరమైనప్పుడు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**అదోఽనుపదేశే [ 1.4.70 ]**

ఇతరులకు చెప్పుట అను అర్థము కానప్పుడు త్యాదాదిగణములోని 'అదః' శబ్దమునకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**తిరోఽన్తర్ధౌ [ 1.4.71 ]**

అంతర్ధి అంటే వ్యవధానము అని అర్థము. అట్టి అర్థములో ప్రయోగించిన 'తిరః' శబ్దమునకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**విభాషా కృఞి [ 1.4.72 ]**

వ్యవధానము అనేఅర్థములో 'తిరః' శబ్దము కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**ఉపాజేఽన్వాజే [ 1.4.73 ]**

దుర్బలునికి బలము కలిగించుట అని ఉపాజే, అన్వాజే అను శబ్దములకు అర్థము. ఇవి ప్రతిరూపకమైన అవ్యయములు. ఇవి కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**సాక్షాత్ప్రభృతీని చ [ 1.4.74 ]**

సాక్షాత్ ఇత్యాది శబ్దములు కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**అనత్యాధాన ఉరసిమనసీ [ 1.4.75 ]**

అత్యాధానము అంటే ఉంచుట అని అర్థం. తద్వ్యతిరేకము అనత్యాధానము. ఇట్టి అర్థములో ఉరసి, మనసి శబ్దములు కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**మధ్యేపదేనివచనే చ [ 1.4.76 ]**

అత్యాధానము అంటే ఉంచుట అని అర్థం. తద్వ్యతిరేకము అనత్యాధానము. ఇట్టి అర్థములో మధ్యే, పదే, నివచనే శబ్దములు కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**నిత్యం హస్తే పాణావుపయమనే [ 1.4.77 ]**

పెండ్లి అను అర్థములో హస్తే, పాణౌ శబ్దములు కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**ప్రాధ్వం బన్ధనే [ 1.4.78 ]**

ప్రాధ్వం అంటే అనుకూల్యము అని అర్థం. ఇది బంధనము అను అర్థములో ప్రాధ్వం శబ్దము కృధాతువుతో ప్రయోగించిన నిత్యముగా 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**జీవికోపనిషదావౌపమ్యే [ 1.4.79 ]**

ఔపమ్య విషయములో కృధాతువుతో ప్రయోగించిన జీవికా, ఉపనిషద్ శబ్దములు 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**కర్మప్రవచనీయాః [ 1.4.83 ]**

ఇది అధికార సూత్రము, సంజ్ఞా సూత్రము కూడా. 'అధిరీశ్వరే [1.4.97]' వరకు ఇటుపై చెప్పబడునవన్ని 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞ.

**అనుర్లక్షణే [ 1.4.84 ]**

లక్షణము అంటే గుర్తు. లక్షణము ద్యోతన పరుచుటకు 'అను' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**తృతీయార్థే [ 1.4.85 ]**

తృతీయార్థము ద్యోతకమైనప్పుడు 'అను' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**హీనే [ 1.4.86 ]**

హీనము(తక్కువ) అను అర్థము ద్యోతకమైనప్పుడు 'అను' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**ఉపోఽధికే చ [ 1.4.87 ]**

అధికుడు,హీనుడుఅను అర్థము ద్యోతకమైనప్పుడు 'ఉప' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**అపపరీ వర్జనే [ 1.4.88 ]**

అప, పరీ అను శబ్దములు విడుచుట అను అర్థములో ద్యోతకమైనప్పుడు వానికి 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**ఆఙ్ మర్యాదావచనే [ 1.4.89 ]**

మర్యాద అను అర్థములో ద్యోతకమైనప్పుడు 'ఆఙ్' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**లక్షణేత్థమ్భూతాఖ్యానభాగవీప్సాసు ప్రతిపర్యనవః [ 1.4.90 ]**

లక్షణము అనగా సూచకము. ఇత్థంభూతాఖ్యానము అంటే ఇలా జరిగిందిట అని పరిస్థితిని వ్యాఖ్యానించటం, భాగము, వీప్సా అంటే అంతటా విశేషముగా వ్యాపించియుండుట. ఈ అర్థములలో ద్యోతకమైనప్పుడు 'ప్రతి', 'పరి' శబ్దములు 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**అభిరభాగే [ 1.4.91 ]**

భాగము అను అర్థమున కాకుండా లక్షణము ఇత్యాది ఇతరార్థములలో 'అభి' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**ప్రతిః ప్రతినిధిప్రతిదానయోః [ 1.4.92 ]**

ప్రతినిధి అనగా ముఖ్యునితో సమానమై, అతని అనుపస్థితిలో వాని కార్యములు నిర్వహించువాడు. ప్రతిదానము అనగా దానము చేసిన వస్తువునకు బదులుగా వేరొక వస్తువునిచ్చుట. ఈ రెండు అర్థములలో 'ప్రతి' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**అధిపరీ అనర్థకౌ [ 1.4.93 ]**

ఎటువంటి అర్థమును లేకుండా ప్రయోగించిన 'అధి', 'పరి' అను శబ్దములకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'గతి', 'ఉపసర్గ' సంజ్ఞలను పొందవు.

**సుః పూజాయామ్ [ 1.4.94 ]**

పూజా అంటే గౌరవము, బాగుగా అను అర్థము. అలా పూజార్థములో వచ్చే 'సు' శబ్దము 'నిపాత' సంజ్ఞతో పాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'ఉపసర్గ' సంజ్ఞను పొందదు.

**అతిరతిక్రమణే చ [ 1.4.95 ]**

పూజా అంటే గౌరవము, బాగుగా అను అర్థము. అలా పూజార్థములో లేక అతిక్రమణార్థములో వచ్చే 'అతి' శబ్దము 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'ఉపసర్గ' సంజ్ఞను పొందదు.

**అపిః పదార్థసమ్భావనాన్వవసర్గగర్హాసముచ్చయేషు [ 1.4.96 ]**

పదార్థము, సంభావనము, అన్వవసర్గము, గర్హము, సముచ్చయము అను అర్థములలో వచ్చు 'అపి' శబ్దము 'నిపాత' సంజ్ఞతో పాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**అధిరీశ్వరే [ 1.4.97 ]**

'అధి' శబ్దము స్వస్వామిభావ సూచకముగా ప్రయోగించినప్పుడు 'నిపాత' సంజ్ఞతో పాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**విభాషా కృఞి  [ 1.4.98 ]**

'అధి' శబ్దముకంటే పరముగా కృధాతువు ఉన్నచో  'నిపాత' సంజ్ఞతో పాటు వికల్పముగా 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

## ఉపసర్గ ( 53 )

**ఉపసర్గాః క్రియాయోగే [ 1.4.59 ]**

ప్రాదులు క్రియతో కలిసినప్పుడు 'ఉపసర్గ' సంజ్ఞ.

**అధిపరీ అనర్థకౌ [ 1.4.93 ] (అప)**

(అపవాద) ఎటువంటి అర్థమును లేకుండా ప్రయోగించిన 'అధి', 'పరి' అను శబ్దములకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'గతి', 'ఉపసర్గ' సంజ్ఞలను పొందవు.

**సుః పూజాయామ్ [ 1.4.94 ] (అప)**

(అపవాద) పూజా అంటే గౌరవము, బాగుగా అను అర్థము.  అలా పూజార్థములో వచ్చే 'సు' శబ్దము 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'ఉపసర్గ' సంజ్ఞను పొందదు.

**అతిరతిక్రమణే చ [ 1.4.95 ] (అప)**

(అపవాద) పూజా అంటే గౌరవము, బాగుగా అను అర్థము.  అలా పూజార్థములో లేక అతిక్రమణార్థములో వచ్చే 'అతి' శబ్దము 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'ఉపసర్గ' సంజ్ఞను పొందదు.

## గతి ( 54 )

**గతిశ్చ [ 1.4.60 ]**

ప్రాదులు క్రియతో కలిసినప్పుడు 'ఉపసర్గ' సంజ్ఞతో పాటు 'గతి' సంజ్ఞను కూడా పొందును.

**ఊర్యాదిచ్విడాచశ్చ  [1.4.61]**

ఊర్యాదిగణములోని శబ్దములు, చ్వి, డాచ్ ప్రత్యయాంత శబ్దములు క్రియతో కూడియున్న నిపాత సంజ్ఞ, గతి సంజ్ఞ కూడా పొందును.

**అనుకరణం చానితిపరమ్ [ 1.4.62 ]**

'ఇతి' శబ్దము లేకుండ అనుకరణం అను అర్థములో ప్రయోగించినప్పుడు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**ఆదరానాదరయోః సదసతీ [ 1.4.63 ]**

ఆదరము అను అర్థములో సత్, అనాదరము అను అర్థములో అసత్ శబ్దములు క్రియాయోగములో ప్రయోగించినప్పుడు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి'సంజ్ఞ.

**భూషణేఽలమ్** [ 1.4.64 ]

అలమ్ అను శబ్దానికి అనేకార్థములు. అందులో భూషణము అని ఒకటి. అట్టి భూషణార్థములో క్రియాయోగములో ప్రయోగించినప్పుడు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి'సంజ్ఞ.

**అన్తరపరిగ్రహే** [ 1.4.65 ]

పరిగ్రహము అంటే స్వీకరించుట అని అర్థం. అలా పరిగ్రహార్థములో కాకుండ ఇతర అర్థములలో 'అంతః' శబ్దమునకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**కణేమనసీ శ్రద్ధాప్రతీఘాతే** [ 1.4.66 ]

కోరిక తీర్చుకోవటం అనే అర్థములో క్రియాయోగము కలిగిన 'కణే', 'మనస్' శబ్దములకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**పురోఽవ్యయమ్** [ 1.4.67 ]

అవ్యయమైన అసిప్రత్యయాంతమైన పురస్ శబ్దమునకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**అస్తం చ** [ 1.4.68 ]

అవ్యయమైనప్పుడు మకారాంతమైన అస్తమ్ శబ్దము క్రియాయోగములో 'నిపాత' సంజ్ఞతోపాటు అనుపలబ్ధి అను అర్థమున మాత్రమే 'గతి' సంజ్ఞ.

**అచ్ఛ గత్యర్థవదేషు** [ 1.4.69 ]

అవ్యయమైన అచ్ఛ శబ్దము గత్యర్థకధాతువులు, వద ధాతువు పరమైనప్పుడు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**అదోఽనుపదేశే** [ 1.4.70 ]

ఇతరులకు చెప్పుట అను అర్థము కానప్పుడు త్యాదాదిగణములోని 'అదః' శబ్దమునకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**తిరోఽన్తర్ధౌ** [ 1.4.71 ]

అంతర్ధి అంటే వ్యవధానము అని అర్థము. అట్టి అర్థములో ప్రయోగించిన 'తిరః' శబ్దమునకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**విభాషా కృఞి** [ 1.4.72 ]

వ్యవధానము అనేఅర్థములో 'తిరః' శబ్దము కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**ఉపాజేఽన్వాజే** [ 1.4.73 ]

దుర్బలునికి బలము కలిగించుట అని ఉపాజే, అన్వాజే అను శబ్దములకు అర్థము. ఇవి ప్రతిరూపకమైన అవ్యయములు. ఇవి కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**సాక్షాత్ప్రభృతీని చ [ 1.4.74 ]**

సాక్షాత్ ఇత్యాది శబ్దములు కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**అనత్యాధాన ఉరసిమనసీ [ 1.4.75 ]**

అత్యాధానము అంటే ఉంచుట అని అర్థం. తద్వ్యతిరేకము అనత్యాధానము. ఇట్టి అర్థములో ఉరసి, మనసి శబ్దములు కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**మధ్యేపదేనివచనే చ [ 1.4.76 ]**

అత్యాధానము అంటే ఉంచుట అని అర్థం. తద్వ్యతిరేకము అనత్యాధానము. ఇట్టి అర్థములో మధ్యే, పదే, నివచనే శబ్దములు కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**నిత్యం హస్తే పాణావుపయమనే [ 1.4.77 ]**

పెండ్లి అను అర్థములో హస్తే, పాణౌ శబ్దములు కృధాతువుతో ప్రయోగించిన 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'గతి' సంజ్ఞ.

**ప్రాధ్వం బన్ధనే [ 1.4.78 ]**

ప్రాధ్వం అంటే అనుకూల్యము అని అర్థం. ఇది బంధనము అను అర్థములో ప్రాధ్వం శబ్దము కృధాతువుతో ప్రయోగించిన నిత్యముగా 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**జీవికోపనిషదావౌపమ్యే [ 1.4.79 ]**

ఔపమ్య విషయములో కృధాతువుతో ప్రయోగించిన జీవికా, ఉపనిషద్ శబ్దములు 'నిపాత' సంజ్ఞతోపాటు వికల్పముగా 'నిపాత' సంజ్ఞతోపాటు 'గతి' సంజ్ఞ.

**అధిపరీ అనర్థకౌ [ 1.4.93 ] (అప)**

(అపవాద) ఎటువంటి అర్థమును లేకుండా ప్రయోగించిన 'అధి', 'పరి' అను శబ్దములకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'గతి', 'ఉపసర్గ' సంజ్ఞలను పొందవు.

## కర్మప్రవచనీయ ( 55 )

**కర్మప్రవచనీయాః [ 1.4.83 ]**

ఇది అధికార సూత్రము, సంజ్ఞా సూత్రము కూడా. 'అధిరీశ్వరే [1.4.97]' వరకు ఇటుపై చెప్పబడునవన్ని 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞ.

**అనుర్లక్షణే [ 1.4.84 ]**

లక్షణము అంటే గుర్తు. లక్షణము ద్యోతన పరుచుటకు 'అను' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**తృతీయార్థే [ 1.4.85 ]**

తృతీయార్థము ద్యోతకమైనప్పుడు 'అను' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**హీనే [ 1.4.86 ]**

హీనము(తక్కువ) అను అర్థము ద్యోతకమైనప్పుడు 'అను' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**ఉపోఽధికే చ [ 1.4.87 ]**

అధికుడు,హీనుడుఅను అర్థము ద్యోతకమైనప్పుడు 'ఉప' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**అపపరీ వర్జనే [ 1.4.88 ]**

అప, పరీ అను శబ్దములు విడుచుట అను అర్థములో ద్యోతకమైనప్పుడు వానికి 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**ఆఙ్ మర్యాదావచనే [ 1.4.89 ]**

మర్యాద అను అర్థములో ద్యోతకమైనప్పుడు 'ఆఙ్' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**లక్షణేత్థమ్భూతాఖ్యానభాగవీప్సాసు ప్రతిపర్యనవః [ 1.4.90 ]**

లక్షణము అనగా సూచకము. ఇత్థంభూతాఖ్యానము అంటే ఇలా జరిగిందిట అని పరిస్థితిని వ్యాఖ్యానించటం, భాగము, వీప్సా అంటే అంతటా విశేషముగా వ్యాపించియుండుట. ఈ అర్థములలో ద్యోతకమైనప్పుడు 'ప్రతి', 'పరి' శబ్దములు 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**అభిరభాగే [ 1.4.91 ]**

భాగము అను అర్థమున కాకుండా లక్షణము ఇత్యాది ఇతరార్థములలో 'అభి' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**ప్రతిః ప్రతినిధిప్రతిదానయోః [ 1.4.92 ]**

ప్రతినిధి అనగా ముఖ్యునితో సమానమై, అతని అనుపస్థితిలో వాని కార్యములు నిర్వహించువాడు. ప్రతిదానము అనగా దానము చేసిన వస్తువునకు బదులుగా వేరొక వస్తువునిచ్చుట. ఈ రెండు అర్థములలో 'ప్రతి' శబ్దము 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**అధిపరీ అనర్థకౌ [ 1.4.93 ]**

ఎటువంటి అర్థమును లేకుండా ప్రయోగించిన 'అధి', 'పరి' అను శబ్దములకు 'నిపాత' సంజ్ఞతోపాటు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'గతి', 'ఉపసర్గ' సంజ్ఞలను పొందవు.

**సుః పూజాయామ్ [ 1.4.94 ]**

పూజా అంటే గౌరవము, బాగుగా అను అర్థము. అలా పూజార్థములో వచ్చే 'సు' శబ్దము 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'ఉపసర్గ' సంజ్ఞను పొందదు.

**అతిరతిక్రమణే చ [ 1.4.95 ]**

పూజా అంటే గౌరవము, బాగుగా అను అర్థము. అలా పూజార్థములో లేక అతిక్రమణార్థములో వచ్చే 'అతి' శబ్దము 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును. 'ఉపసర్గ' సంజ్ఞను పొందదు.

**అపిః పదార్థసమ్భావనాన్వవసర్గగర్హాసముచ్చయేషు [ 1.4.96 ]**

పదార్థము, సంభావనము, అన్వవసర్గము, గర్హము, సముచ్చయము అను అర్థములలో వచ్చు 'అపి' శబ్దము 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**అధిరీశ్వరే [ 1.4.97 ]**

'అధి' శబ్దము స్వస్వామిభావ సూచకముగా ప్రయోగించినప్పుడు 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

**విభాషా కృఞి [ 1.4.98 ]**

'అధి' శబ్దముకంటే పరముగా కృధాతువు ఉన్నచో వికల్పముగా 'కర్మప్రవచనీయ' సంజ్ఞను పొందును.

## పరస్మైపదమ్ ( 56 )

**లః పరస్మైపదమ్ [1.4.99]**

లకార స్థానమున విధింపబడు ఆదేశములకు 'పరస్మైపదమ్' సంజ్ఞ. (తిఙ్ ప్రత్యాహారములోని మొదటి 9 ఆదేశములనే ఇక్కడ గ్రహించాలి)

## ఆత్మనేపదమ్ ( 57 )

**తఙానావాత్మనేపదమ్ [1.4.100]**

లకార స్థానమున విధింపబడు తఙ్ మరియు ఆన్ ఆదేశములకు 'ఆత్మనేపదమ్' సంజ్ఞ.

## ప్రథమ ( 58 )

**తిఙస్త్రీణి త్రీణి ప్రథమమధ్యమోత్తమాః [1.4.101]**

తిఙ్ ప్రత్యయములు తొమ్మిదిలో మూడు మూడు వంతున విభజించగా, మొదటి మూడు ప్రథమ, రెండవ మూడిటికి 'మధ్యమ' చివరి మూడింటికి 'ఉత్తమ' సంజ్ఞ ప్రవర్తించును.

## మధ్యమ ( 59 )

**తిఙస్త్రీణి త్రీణి ప్రథమమధ్యమోత్తమాః [1.4.101]**

తిఙ్ ప్రత్యయములు తొమ్మిదిలో మూడు మూడు వంతున విభజించగా, మొదటి మూడు ప్రథమ, రెండవ మూడిటికి 'ఉత్తం' చివరి మూడింటికి 'ఉత్తమ' సంజ్ఞ ప్రవర్తించును.

## ఉత్తమ ( 60 )

**తిఙస్త్రీణి త్రీణి ప్రథమమధ్యమోత్తమాః** [1.4.101]

తిఙ్ ప్రత్యయములు తొమ్మిదిలో మూడు మూడు వంతున విభజించగా, మొదటి మూడు ప్రథమ, రెండవ మూడిటికి 'ఉత్తం' చివరి మూడింటికి 'ఉత్తమ' సంజ్ఞ ప్రవర్తించును.

## ఏకవచన ( 61 )

**తాన్యేకవచనద్వివచనబహువచనాన్యేకశః** [1.4.102]

పూర్వసూత్రములో చెప్పిన మూడు మూడు సమూహములలోని ప్రతి సమూహములోని మూడు ప్రత్యయములు వరుసగా 'ఏకవచన", 'ద్వివచన', 'బహువచన' సంజ్ఞను పొందును.

**సుపః**[1.4.103]

సుప్ ప్రత్యాహారములో చెప్పిన మూడు మూడు సమూహములలోని ప్రతి సమూహములోని మూడు ప్రత్యయములు వరుసగా 'ఏకవచన", 'ద్వివచన', 'బహువచన' సంజ్ఞను పొందును.

## ద్వివచన ( 62 )

**తాన్యేకవచనద్వివచనబహువచనాన్యేకశః** [1.4.102]

పూర్వసూత్రములో చెప్పిన మూడు మూడు సమూహములలోని ప్రతి సమూహములోని మూడు ప్రత్యయములు వరుసగా 'ఏకవచన", 'ద్వివచన', 'బహువచన' సంజ్ఞను పొందును.

**సుపః**[1.4.103]

సుప్ ప్రత్యాహారములో చెప్పిన మూడు మూడు సమూహములలోని ప్రతి సమూహములోని మూడు ప్రత్యయములు వరుసగా 'ఏకవచన", 'ద్వివచన', 'బహువచన' సంజ్ఞను పొందును.

## బహువచన ( 63 )

**తాన్యేకవచనద్వివచనబహువచనాన్యేకశః** [1.4.102]

పూర్వసూత్రములో చెప్పిన మూడు మూడు సమూహములలోని ప్రతి సమూహములోని మూడు ప్రత్యయములు వరుసగా 'ఏకవచన", 'ద్వివచన', 'బహువచన' సంజ్ఞను పొందును.

**సుపః**[1.4.103]

సుప్ ప్రత్యాహారములో చెప్పిన మూడు మూడు సమూహములలోని ప్రతి సమూహములోని మూడు ప్రత్యయములు వరుసగా 'ఏకవచన", 'ద్వివచన', 'బహువచన' సంజ్ఞను పొందును.

## విభక్తి ( 64 )

**విభక్తిశ్చ** [1.4.104]

సుప్, తిఙ్ ప్రత్యయములకు 'విభక్తి' సంజ్ఞ.

సుప్-ప్రత్యయాః తిఙ్-ప్రత్యయాః విభక్తిసంజ్ఞకాః భవన్తి ।

**ప్రాగ్దిశో విభక్తిః** [5.3.1]

ప్రకృత సూత్రమునుండి 5.3.26 వరకు కల అన్ని సూత్రములలోని ప్రత్యయములకు కూడా 'విభక్తి' సంజ్ఞ ప్రవర్తించును.

## సంహితా ( 65 )

**పరః సంనికర్షః సంహితా** [1.4.109]

వర్ణములయొక్క అతిశయసాన్నిధ్యమునకు 'సంహితా' సంజ్ఞ.

## అవసానమ్ ( 66 )

**విరామోఽవసానమ్** [1.4.110]

వర్ణములయొక్క అభావమునకు 'అవసానమ్' సంజ్ఞ.

## సమాస ( 67 )

**ప్రాక్ కడారాత్ సమాసః** [ 2.1.3 ]

ప్రకృత సూత్రము నుండి 'కడారాః కర్మధారయే'[2.2.38] వరకు కల అన్ని సూత్రములకు 'సమాస' సంజ్ఞ ప్రవర్తించును.

## అవ్యయీభావ ( 68 )

**అవ్యయీభావః** [2.1.5]

ప్రకృత సూత్రము నుండి 'తత్పురుషః'[2.2.22] వరకు కల అన్ని సూత్రములకు 'అవ్యయీభావ' సంజ్ఞ ప్రవర్తించును.

**యథాసాదృశ్యే** [2.1.7]

'సాదృశ్యమ్' అను అర్థములో కాని 'యథా' అను అవ్యయము సుబంతముతో సమసించినప్పుడు ఆ సమాసమునకు 'అవ్యయీభావ' సంజ్ఞ.

**యావదవధారణే** [2.1.8]

'అవధారణా' అను అర్థములో 'యావత్' అను అవ్యయము సుబంతముతో సమసించినప్పుడు ఆ సమాసమునకు 'అవ్యయీభావ' సంజ్ఞ.

**అక్షశలాకాసంఖ్యాః పరిణా** [2.1.10]

'అక్ష', 'శలాకా', 'సంఖ్యా' శబ్దములు 'పరి' అను అవ్యయముతో సమసించినప్పుడు ఆ సమాసమునకు 'అవ్యయీభావ' సంజ్ఞ.

## తత్పురుష ( 69 )

**తత్పురుషః** [ 2.1.22 ]

ఇది అధికార సూత్రము, సంజ్ఞా సూత్రము కూడా. 'శేషో బహువ్రీహి [2.2.23]' వరకు ఇటుపై చెప్పబడునవన్ని 'తత్పురుష' సంజ్ఞ.

## ద్విగు ( 70 )

**ద్విగుశ్చ** [ 2.1.23 ]

ద్విగుసమాసమునకు కూడా 'తత్పురుష' సంజ్ఞ.

## బహువ్రీహి ( 71 )

**శేషో బహువ్రీహిః** [ 2.2.23 ]

పూర్వసూత్రములలో చెప్పిన సమాసములు కాక మిగిలిన సమాసమునకు 'బహువ్రీహి' సంజ్ఞ.

## ద్వన్ద్వ ( 72 )

**చార్థే ద్వన్ద్వః** [ 2.2.29 ]

చ(కూడా) అను అర్థములో సుబంతాలు సమసించిన అట్టి సమాసానికి 'ద్వంద్వ' సంజ్ఞ.

## ఆమన్త్రిత ( 73 )

**సాఽఽమన్త్రితమ్** [ 2.3.48 ]

సంబోధనార్థములో ప్రథమావిభక్త్యంతమైన శబ్దమునకు 'ఆమంత్రిత' సంజ్ఞ.

## సంబుద్ధిః ( 74 )

**ఏకవచనం సంబుద్ధిః**[2.3.49]

సంబోధన ప్రథమావిభక్తిలోని ఏకవచనమునకు 'సంబుద్ధి' సంజ్ఞ.

## ప్రత్యయ ( 75 )

**ప్రత్యయః** [ 3.1.1 ]

ప్రకృత సూత్రము నుండి పంచమాధ్యాయము సమాప్తి వరకు కల అన్ని సూత్రములయందు చెప్పబడినవాటికి 'ప్రత్యయ' సంజ్ఞ ప్రవర్తించును.

## ఉపపదమ్ ( 76 )

**తత్రోపపదం సప్తమీస్థమ్** [3.1.92]

'ధాతోః' అను అధికారములోని సూత్రములలో (మూడవ అధ్యాయము చివరివరకు) సప్తమ్యంతమైన పదములకు ''ఉపపద'సంజ్ఞ ప్రవర్తిస్తుంది.

## కృత్ ( 77 )

**కృదతిఙ్** [ 3.1.93 ]

'ధాతోః' అను అధికారములోని సూత్రములలో (మూడవ అధ్యాయము చివరివరకు) తిఙ్ ప్రత్యయములు కాని అన్ని ప్రత్యయములకు 'కృత్'సంజ్ఞ ప్రవర్తిస్తుంది.

## కృత్య ( 78 )

**కృత్యాః** [ 3.1.95 ]

ప్రకృతసూత్రమునుండి 'ణ్వుల్ తృచౌ [3.1.133] వరకు ఉన్న ప్రత్యయములకు కృత్ సంజ్ఞతో పాటు 'కృత్యా' సంజ్ఞ కూడా పొందుతుంది.

## సత్ ( 79 )

**తౌ సత్** [ 3.2.127 ]

'శతృ', 'శానచ్' ప్రత్యయాలకు 'సత్' సంజ్ఞ ప్రవర్తిస్తుంది.

## సార్వధాతుక ( 80 )

**తిజ్శిత్సార్వధాతుకమ్**[3.4.113]

తిజ్ ప్రత్యయాలు, శిత్ అయిన ప్రత్యయాలకు 'సార్వధాతుక' సంజ్ఞ.

**లిట్ చ** [ 3.4.115 ] **(అప)**

(అపవాద) లిట్ లకార విషయమున వచ్చెడి తిజ్ ప్రత్యయాలు ఆర్ధధాతుక సంజ్ఞ పొందును. ఇది సార్వధాతుకసంజ్ఞకు అపవాదు.

**లిజాశిషి** [ 3.4.116 ]

ఆశీర్లింగ్ లకార విషయమున వచ్చెడి తిజ్ ప్రత్యయాలు ఆర్ధధాతుక సంజ్ఞ పొందును. విధిలిజ్ మాత్రము సార్వధాతుకమే. ఇది సార్వధాతుకసంజ్ఞకు అపవాదు.

**ఛన్దస్యుభయథా** [ 3.4.117 ]

వేదమునందలి ప్రయోగములలో సార్వధాతుక ఆర్ధధాతుక సంజ్ఞలు ప్రవర్తించును.

## ఆర్ధధాతుక ( 81 )

**ఆర్ధధాతుకం శేషః** [3.4.114]

తిజ్ ప్రత్యయాలు, శిత్ అయిన ప్రత్యయాలు మినహాయించి, మిగిలిన ధాతువులన్నీ 'ఆర్ధధాతుక' సంజ్ఞ.

**లిట్ చ** [ 3.4.115 ]

లిట్ లకార విషయమున వచ్చెడి తిజ్ ప్రత్యయాలు ఆర్ధధాతుక సంజ్ఞ పొందును. ఇది సార్వధాతుకసంజ్ఞకు అపవాదు.

**లిజాశిషి** [ 3.4.116 ]

ఆశీర్లింగ్ లకార విషయమున వచ్చెడి తిజ్ ప్రత్యయాలు ఆర్ధధాతుక సంజ్ఞ పొందును. విధిలిజ్ మాత్రము సార్వధాతుకమే. ఇది సార్వధాతుకసంజ్ఞకు అపవాదు.

**ఛన్దస్యుభయథా** [ 3.4.117 ]

వేదమునందలి ప్రయోగములలో సార్వధాతుక ఆర్ధధాతుక సంజ్ఞలు ప్రవర్తించును.

## తద్ధిత ( 82 )

**తద్ధితాః** [4.1.76]

ప్రకృతసూత్రము నుండి పంచమాధ్యాయ సమాప్తి వరకు విధించు ప్రత్యయములకు 'తద్ధిత' సంజ్ఞ ప్రవర్తించును.

## గోత్రమ్ ( 83 )

**అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్** [4.1.162]

పౌత్రుని (కుమారుని కుమారుడు) మొదలు సంతానమునకు 'గోత్ర' సంజ్ఞ.

**జీవతి తు వంశ్యే యువా** [4.1.163] **(అప)**

(అపవాద) పౌత్రుని (కుమారుని కుమారుడు) మొదలు సంతానము వారి తండ్రిమొదలైన వారు జీవించియుండిన గోత్రసంజ్ఞ బాధించి 'యువ' సంజ్ఞ ప్రాప్తించును.

**భ్రాతరి చ జ్యాయసి [4.1.164] (అప)**

(అపవాద) పౌత్రుని (కుమారుని కుమారుడు) మొదలు సంతానము వారి తండ్రిమొదలైన వారు జీవించిలేకున్నను పెద్దన్నగారు జీవించియున్న గోత్రసంజ్ఞ బాధించి 'యువ' సంజ్ఞ ప్రాప్తించును.

**వాన్యస్మిన్ సపిణ్డే స్థవిరతరే జీవతి [4.1.165] (అప)**

(అపవాద) పెద్దన్నగారిని విడిచి ఇతరులైన సపిండులలో జ్యేష్ఠుడు జీవించియున్న గోత్రసంజ్ఞను వికల్పముగా బాధించి 'యువ' సంజ్ఞ ప్రాప్తించును.

**వృద్ధస్య చ పూజాయామ్ [4.1.166] (అప)**

(అపవాద) గోత్రసంజ్ఞకలిగిన వారిని ఆదరించు సందర్భమున గోత్రసంజ్ఞను వికల్పముగా బాధించి 'యువ' సంజ్ఞ ప్రాప్తించును.

## యువ ( 84 )

**జీవతి తు వంశ్యే యువా [4.1.163]**

పౌత్రుని (కుమారుని కుమారుడు) మొదలు సంతానము వారి తండ్రిమొదలైన వారు జీవించియుండిన గోత్రసంజ్ఞ బాధించి 'యువ' సంజ్ఞ ప్రాప్తించును.

**భ్రాతరి చ జ్యాయసి [4.1.164]**

పౌత్రుని (కుమారుని కుమారుడు) మొదలు సంతానము వారి తండ్రిమొదలైన వారు జీవించిలేకున్నను పెద్దన్నగారు జీవించియున్న గోత్రసంజ్ఞ బాధించి 'యువ' సంజ్ఞ ప్రాప్తించును.

**వాన్యస్మిన్ సపిణ్డే స్థవిరతరే జీవతి [4.1.165]**

పెద్దన్నగారిని విడిచి ఇతరులైన సపిండులలో జ్యేష్ఠుడు జీవించియున్న గోత్రసంజ్ఞను వికల్పముగా బాధించి 'యువ' సంజ్ఞ ప్రాప్తించును.

**వృద్ధస్య చ పూజాయామ్ [4.1.166]**

గోత్రసంజ్ఞకలిగిన వారిని ఆదరించు సందర్భమున గోత్రసంజ్ఞను వికల్పముగా బాధించి 'యువ' సంజ్ఞ ప్రాప్తించును.

## తద్రాజ ( 85 )

**తే తద్రాజాః [4.1.174]**

క్షత్రియవాచకములైన జనపదనామములు 'తస్య అపత్యమ్' అను అర్థములో విధింపబడిన ప్రత్యయములకు 'తద్రాజ' సంజ్ఞ ప్రవర్తించును.

**ఞ్యాదయస్తద్రాజాః [5.3.119]**

పూగాఞ్ఞ్యోఽగ్రామణీపూర్వాత్ [5.3.112] అను సూత్రమునుండి ప్రకృతసూత్రము వరకు చెప్పబడిన ప్రత్యయములకు 'తద్రాజ' సంజ్ఞ ప్రవర్తిస్తుంది.

## అభ్యాస ( 86 )

**పూర్వోఽభ్యాసః [6.1.4]**

ద్విత్వము చేసినప్పుడు ద్విరుక్తమైన రెండిటిలో మొదటి శబ్దమునకు 'అభ్యాస' సంజ్ఞ.

## అభ్యస్త ( 87 )

**ఉభే అభ్యస్తమ్** [6.1.5]

ద్విత్వము చేసినప్పుడు ద్విరుక్తమైన రెండు శబ్దములకు కలిపి 'అభ్యస్త' సంజ్ఞ.

**జక్షిత్యాదయః షట్** [6.1.6]

జక్షిత్యాది గణములోని ధాతువులలో జక్షి ధాతువునుండి ఆరుధాతువులకు 'అభ్యస్త' సంజ్ఞ.

## ఆమ్రేడితమ్ ( 88 )

**తస్య పరమామ్రేడితమ్** [8.1.2]

'సర్వస్య ద్వే' అనుఅధికారమునందు ద్విత్వము చేసినప్పుడు ద్విరుక్తమైన రెండిటిలో రెండవ శబ్దమునకు 'ఆమ్రేడితమ్' సంజ్ఞ.

★★★

★★★

## ఒకటికన్నా ఎక్కువ నిర్వచనాలు కలిగిన 'సంజ్ఞలు'



★★★